# జమీన్ రైతు

స్థాపకులు: నెల్లూరు వెంకటరామానాయుడుగారు

సంపాదకుడు: నెల్లూరు శ్రీరామమూర్తి

Regd. No. M. No. 19
స్థాపితం: 1930
సంపుటి: 67 సంచిక: 38
19-9-1986
శుక్రవారం
14 పేజీలు రూపాయి

# నెల్లూరులో నీటి కరువు భయంకరం- ప్రజల అగచాట్లు హృదయవిదారకం!

నెల్లూరు నివాసులు నీళ్ళ కోసం ... ఇంత అన్నం పెట్టమ్మా అని అడగడం లేదు. గొంతెండి పోతూంది ఇన్ని నీళ్ళు పొయ్యి తల్లీ అని ఆర్తనాదం చేస్తున్నారు. ఇల్లాలు గృహిణులు పండింతంతా వారి కాళ్ళలో ప్రమ్మరింతరా ... ఒకప్పుడు దిగవిడిచి దీనంగా, దిగంబరంగా తయారైంది. ఎటుచూసినా జనం చేటంతవ్వ. తరక్కురి కనిపించటం లేదు. బావులు నీళ్ళులేక బావురుమంటున్నాయి. ఎంత తోడినా బురదతప్ప నీళ్ళు ఊరటంలేదు. మునిసిపల్

## పౌరులు వలసపోక తప్పదా?

...కి సిద్ధపడుతున్నారేతప్ప, గ్రామస్థులు ... మావల్లకాదంటున్నారు.

నెల్లూరులో ఇంతటి దయనీయమైన పరిస్థితులు ఎప్పుడూలేవు; ఇంత నీటి కటకట నెల్లూరువాసులు ఎప్పుడూ అనుభవించిన సాక్ష్యాల్లేవు.

మున్నూటఅరవైరోజులూ లేవకుండా మంచినీళ్లు ప్రసాదించే పెన్నమ్మతల్లి.

కొళాయిలు పట్టిపోయాయి. రోజంతా దాని క్రింద బిందె పెట్టినా నిండటంలేదు; పొట్టుబొట్టుగాతప్ప కొళాయిల్లో ధారచూసి ఎన్నాళ్ళయిపోయిందో!

మరీ మూడురోజుల నుంచి నెల్లూరీయులు నీటికి ముఖంవాచిపోయారు. ఒక్క హరనాధపురం, రామలింగాపురం ప్రాం

—కొరవ 7 వ పేజీలో



ఫిల్టర్‌పాయింటే ప్రాణదాతలు; సైకిళ్ళు వాటర్ ట్యాంకర్లయినాయి!

# జమీన్‌రైతు

## శాశ్వత నివారణ కావాలి

నెల్లూరుజిల్లాలో వాతావరణ పరిస్థితులు ఏటికేడాది అస్తవ్యస్తమౌతున్నాయి; అదుపు తప్పిపోతున్నాయి ఎప్పుడు వానకురుస్తుందో తెలియదు; ఎప్పుడు ఎండలు మిడిసికాస్తాయో తెలియదు; ఏరాత్రి తుఫాను విరుచుకొని పడుతుందో అసలే తెలియదు.

వాతావరణం ఇట్లా గాలిలో పెట్టిన దీపంవలె తయారుకావడంతో వ్యవసాయంకూడా అస్తవిస్తమైపోయింది. ఫిల్టర్‌పాయింట్ల ఆధారంతో మొలగొలుకునార్లు పోసుకుందామంటే, వేతలనాటికైనా వర్షం పడుతుందన్న నమ్మకంలేదు. మొలగొలుకు మానేసి ఐ. ఆర్. 20 పైరు పెట్టుకుందామంటే, అప్పుడు తుఫాను వస్తాయో, ఉప్పెనలేవచ్చి ముంచిపోతాయో తెలియని అయోమయ స్థితి.

రాయలసీమ వాసులకు నెల్లూరుజిల్లాఅంటే కన్నెర్ర; సస్యశ్యామలమైన డెల్టాప్రాంతమని వారి అంచనా! కానీ ఆడెల్టా పరిస్థితి ఇప్పుడు ఏ రాయలసీమ ప్రాంతానికీ తీసిపోనంత దౌర్భాగ్యపరిస్థితుల నెదుర్కుంటూంది. ఉదయగిరి, రాపూరువంటి మెట్టప్రాంతాల దుస్థితి అడగనే అవసరంలేదు. దాదాపు ఒక దశాబ్దంపైనుంచి, ఏటా కరువు, తుఫానతో గ్రామీణ ఆర్థికవ్యవస్థ సమస్తం కకావికలై పోయింది; రుణభారంతో రైతు క్రుంగిపోతున్నాడు; వ్యవసాయమంటేనే విరక్తి పెంచుకుంటున్నాడు.

కూలినాలి జనం పరిస్థితికూడా అంతే. రైతు పచ్చగావుంటేనే వారికి చేతినిండాపని! ప్రభుత్వం అడపాదడపా చేపట్టే క్షామనివారణ కార్యక్రమాలుకూడా వారికి నమ్మకమైన జీవనోపాధిని కల్పించలేకపోతున్నాయి.

నానాటికీ దుర్భరంగా, దుస్సహంగా తయారౌతున్న ఈవాతావరణ ప్రతికూలతలనుంచి రైతును గట్టుకు లాగేందుకు ప్రభుత్వాలు ఒక తీవ్రాలోచన చేయవలసిన సమయం ఆసన్నమైంది. అయితే మన జిల్లాది విచిత్ర పరిస్థితి. సెప్టెంబరునెల మొదట్లో కేంద్ర కరువు బృందం పరిశీలనకువస్తే, అదేనెల చివర్లో తుఫానుబృందం రావలసి వస్తూంది. పరస్పర భిన్నమైన ఇటువంటి వాతావరణం దేశంలో ఎక్కడాలేదని ఒకసారి, ఒక కేంద్రనిపుణుడు వ్యాఖ్యానించాడు.

అందువల్లనే నెల్లూరుజిల్లాలో ఏ కార్యక్రమం ప్రారంభించదలచుకున్నా కేంద్ర ప్రభుత్వ నియమావళి అడ్డుతగులుతున్నట్లుంది, నిజానికి రాయలసీమలోవలెనే, మన ఉదయగిరి, ఆత్మకూరు, వింజమూరు, సీతారామపురం తదితర ప్రాంతాలను ఎప్పుడో శాశ్వత కరువుపీడిత ప్రాంతాలుగా పరిగణించి, ఆ నివారణ పథకాలు ప్రవేశపెట్టవలసింది. ఇందుకు ఆయాప్రాంతాల గరిష్టసగటువర్షపాతం ఆధారంగా తీసుకుంటారట. ఆదృష్టితోచూసినప్పుడు మనకు ఏడాదిలో ఒక్కరోజు ఒక్క తుఫానుతో పడేవర్షపాతం సరిపోతున్నదట. సంవత్సరంపొడుగునా క్షామదేవతతాండవమాడినా, ఒక్కపూట వరుణదేవుడు ప్రతాపం చూపడంతో ఈ ప్రాంతాలు సహాయానికి నోచుకోలేకపోతున్నాయి. పూర్వపు కలెక్టర్ శ్రీ జన్నత్‌హుసేన్ ప్రభుత్వానికి ఈ విషయం చెప్పారటకూడా!

అందువల్ల మనరాష్ట్ర నాయకులు.జిల్లాలోని విచిత్ర పరిస్థితులను కేంద్రానికివివరించి, సగటు వర్షపాతం ప్రమాణంగా కాకుండా వాస్తవపరిస్థితుల ఆధారంగా సహాయం అందేటట్లు చూడడం అవసరం. క్షామపీడితప్రాంత పథకాలు మనకు వర్తింపజేస్తే, వెనుకబడిన ఉదయగిరివాసులు ఎంతో అభివృద్ధిచెందే అవకాశం కల్గుతుంది.

చెంపదెబ్బ, గోడదెబ్బలవలె కరువు తుఫాను రెండింటితో సతమతమౌతున్న డెల్టా రైతాంగాన్ని ఆదుకోవడానికికూడా రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు ప్రయత్నించాలి.

## జమీన్‌రైతు

19.9.1938

### నెల్లూరు ముచ్చట్లు

గూడూరు డి. ఏ. జ. ర, తిక్కవరం సర్కిలు నామినేషన్ 16 తేది జరిగింది. పోటీలేకుండా కల్లమాల పెల్లేటి వెంకటసుబ్బారెడ్డిగారు ఎన్నుకోబడ్డారు. ఒక బత్తా విల్లుకో అంత మొందుతుందో అరునెల్లు జరుగుతుందో చెప్పలేం.

• • •

కుమార రాజా సాహెబులవారు ట్రంకు టెలిఫోనులో వాయిదాలువేసి కడపటి వాయిదా 14 తేది విజయం చేశారు. తెలిగ్రాములమీద పిలిపించవలసిన కాళంగివారిని తదితర మిత్రవర్గాన్ని చేర్పించారు. అల్లూరిరెడ్డిగారి పెరసనల్ యిన్విటేషనుతో పిలిపించాలసిన కల్లూరు చెంచయ్య ప్రభృతులను పెకిపించారు.

• • •

నెల్లూరు ఆచారివీధి గరల్‌స్కూలు చేర్‌మెన్ రేబాల లక్ష్మీనర్సరెడ్డిగారి మందిరం చేరడం, రంగనాయకుల పేట గరల్‌స్కూలు రు. 24ల నుండి రు. 30ల బాడుగకు మునిసిపల్ మేనేజరుగారి బిల్డింగుకు మార్చడం, జిల్లా బోర్డు బ్రాంచి ఆఫీసు వెంకటగిరిరాజుగారి బిల్డింగుకు పెద్దపవని దొరవారి సత్రములో ఉండగా వారు సమ్మతించని దున రు. 162 ల బాడుగకు యాహ్యాలి సాహెబ్‌గారింటికి మార్చడం, స్వార్థపరత్వంతో కాదని ఆకుకవితా దురీణ ఓరుగంటి రాఘవరెడ్డిగారు ఋజువు చెప్పుతున్నారు.

### అంబేడ్కరుకు వ్యతిరేకపార్టీ

రాబోవు ఎన్నికలో డా॥ అంబేద్కరుగారిపార్టీచే నిలువబెట్టబడు హరిజన అభ్యర్థులతో పోటీచేయుటకు ...

### 50 ఏళ్ల క్రితం ఈవారం

బొంబాయి రాజధానిలోని జాతీయవాదులగు హరిజన నాయకులు కొందరొక పార్టీని యేర్పరచెదరని తెలియుచున్నది.

### జవహర్‌లాల్ సంచారము

కాంగ్రెసు అధ్యక్షులు జవహర్‌లాల్‌గారు మునఫర్‌నగరు జిల్లాయందు సంచారము చేయుచున్నారు. 10 తేది జలాము వద్ద 10,000 కర్షకులకు వుపన్యసించిరి. అచట నుండి సహరాన్‌పూర్ చేరుటకు తమ దారిని వుపయోగింప వీలు లేదని అధికారులు ప్రకటించిరి. అనేక అవస్థలపడి కొంతదూరం మోటారుపైన, కొంత గుర్రంపైన, కొంత నడచి ప్రయాణము చేయుచున్నారు.

• • •

ఇండియాలో 1928 సం॥లో 2633 వివిధరకములైన పత్రికలు ప్రకటింపబడుచుండెడివి. ఇప్పుడు 1584 మాత్రమే వున్నాయి. దినపత్రికలు 147 నుండి 83 కి తగ్గినవి.

• • •

హిమాలయం ప్రయాణం జాస్తి అగుటవల్ల యునైటెడ్ స్టేట్సు గవర్నమెంటువారు కొన్ని వుత్తర్వులు గావించినారు. పశ్చిముమువైపు పొయ్యేవి వరిసంఖ్యలో అనగా 2 వేలు 4 వేలు అడుగుల ఎత్తుల పోవాలని, తూర్పువైపు పొయ్యేవి బేసిసంఖ్యలో అనగా 3 వేలు, 5 వేలు అడుగులఎత్తులో పోవలయును.

### ముస్లిం నాయకుల అరెస్టు

మలర్‌కోట్ల సంస్థానమున క్రిమినల్ ప్రొసీజరు కోడు 107,151 సెక్షనుల ప్రకారం 6 ముస్లిం నాయకులను అరెస్టు చేసినందుకు తమ అసమ్మతిని బహిర్గత మొనర్పుటకుగాను 2000 మంది మహమ్మదీయులు, స్త్రీలు, పురుషులు, పిల్లలు సంస్థానమును విడిచిపెట్టి వెళ్ళిరని తెలియుచున్నది.

## టౌను బస్సులా? యముని మహిషాలా?

నెల్లూరు టౌనులో, టౌను బస్సుల విశృంఖలవిధి మరీ పెరిగిపోతూంది! సగభాగం బస్సులకు సరైన బ్రేకులుండవు; సీట్లుండవు,తలుపు రేకులు గణగణలాడించుకుంటూ, పాదచారుల గుండెలదరగొడుతూ పరుగులు తీస్తున్నాయి. వాటి స్పీడు చూస్తుంటే, ఇవి టౌన్‌బస్సులా? యముని మహిషాలా అని సందేహం కల్గుతుంది. ట్రాఫిక్‌రూల్సు వీరికివర్తించనే వర్తించవు. రిక్షాలు, సైకిల్సు తప్పించుకోడానికి రోడ్డుకు రెండుప్రక్కలా మెలికలు తిరుగుతూపోతుంటాయి. లోపలెక్కిన ప్రయాణీకులకూ మనశ్శాంతి వుండదు. స్పీడుకు కుదుపులో పటిసత్రల్లా బస్సు ఊగిపోవడంతో, ప్రయాణీకులూ ఒకరిపైఒకరు క్రిందామీదాపడాల్సి వస్తూంది. పైగా, కంఠకర్ణ విసుర్లు, కసుర్లు ఇంకొకప్రక్క బాధపెడుతుంటాయి. అధికారులు వీరిని అదుపుచేయలేరా?

నారురాజుపాళెం. కె.వి.నాగేశ్వరరావు

### ప్రతిపక్షాలు ప్రజల పక్షమేనా?

ఇటీవల వెనుకబడిన తరగతులకు పెంచిన రిజర్వేషన్లను ప్రతిపక్ష పార్టీలు హర్షించినాయి. హైకోర్టు తీర్పు వచ్చినప్పటికీ దానిపై తమ అభిప్రాయాన్ని ధైర్యంగా చెప్పలేని పరిస్థితిలో వున్నాయవి. ఓట్లకోసం, అధికారంకోసం సిద్ధాంతాలకు, ప్రజాభిప్రాయానికి తిలోదకాలిస్తున్నారు వీరు.

పేదరికంతో, కర్మకొద్ది అగ్రకులాల్లో పుట్టి, ఆర్థిక ఇబ్బందులతో సతమతమై ప్రారంభ విద్యనుండి ఉన్నతవిద్యవరకు ఫీజుల భారంతో సతమతమవుతున్నారు. తర్వాత ఉద్యోగవేటలో ఎన్నో ఇబ్బందులు రిజర్వేషన్లు కలాపి సంబంధం లేకుండ కల్పించాలని అడగలేని ఈ పార్టీలు ప్రజల సంక్షేమం కోరేవి అని ఎట్లా అనుకోవాలి? అగ్రకులాల్లో పుట్టిన దోషానికి రాబోవు తరం కాలగర్భంలో కల్సిపోవల్సిందేనా?

కోడూరు —వల్లూరు మాధవరావు

## జనవాణి

### ముఖ్యమంత్రిపై దాడి- ఎంత తలవంపులు?

ఇటీవల సచివాలయ ఉద్యోగులు ముఖ్యమంత్రిపై దాడి చేయటం సభ్యప్రపంచం తలవంచుకోవలసిన విషయం. బాధ్యతగల ముఖ్యమంత్రిపై దాడి సమర్థనీయం కాదు. ఆంధ్ర రాష్ట్ర చరిత్రలో ఇటువంటి దాడి జరగడం ఇదే ప్రథమం ఈ విధంగా 'అన్న' గిన్నిస్ బుక్‌లో చోటుచేసుకుంటాడేమో!

కేంద్రంలో భద్రతాసిబ్బంది బాధ్యతా రాహిత్యంవల్ల ఇందిరాగాంధి, జనరల్ వైద్య వంటి ప్రముఖులను పోగొట్టుకొన్నాము. అయినా ఇంకా మన అధి

—కొరవ 10వ పేజీలో

నెల్లూరు కళ్యాణి (ఎ.సి.) లో

**మన "గోపాల్‌రెడ్డి" చిత్రం! మన కందరికీ నచ్చే చిత్రం !!**

సెప్టెంబర్
**25**
విడుదల!









భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# మన్నెంలో మొనగాడు

**S. గోపాల్‌రెడ్డి** B.Sc (Ag) **కోడి రామకృష్ణ**

రిలీజ్: కళ్యాణి ఫిలింస్ (నెల్లూరు)

# సినీ సామ్రాట్‌ల మధ్య చిచ్చు పెట్టిన 'సామ్రాట్'!

సినిమా రంగంలో రాజకీయాలు రోజు రోజుకీ ప్రబలిపోతున్నాయి. బాలకృష్ణ గుడారంలో 'తెలుగుదేశం' అభిమానులు. కృష్ణ గుడారంలో కాంగ్రెస్ అభిమానులు. ఇది అంతకంతకు ఎలాంటి కరి నామాలకు దారితీస్తుందో?

చాలా కాలం క్రితం కంచర్ల శేఖర్‌బాబు "సామ్రాట్" అనే చిత్రాన్ని కృష్ణం రాజుతో తీయాలనుకున్నారు. టైటిల్‌ని కూడా రిజిస్టర్ చేశారు. ఎందుకో ఏమో ఆ చిత్ర నిర్మాణం అప్పటికప్పుడు వాయిదా పడుతూ వచ్చింది. ఆ టైటిల్‌ని రిజిస్టర్ చేసుకున్న గడువు ఏడాదిదాటాక పునరుద్ధరించుకోకపోతే రద్దయిపోయినట్లె లెక్క.

కృష్ణ "బేతాబ్" హిందీ హిట్‌చిత్రం ఆధారంగా తన కుమారుడు రమేష్‌ను హీరోగా పరిచయంచేసే చిత్రానికి "సామ్రాట్" అని నామకరణంచేసి, పత్రికా ప్రకటనలిచ్చి, భారీయెత్తున ప్రారంభోత్సవం చేశారుకూడా.

ఇదితెలిసి వెంటనే శేఖర్‌బాబు సెప్టెంబర్ 1 న బాలకృష్ణ హీరోగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మించే చిత్రానికి "సామ్రాట్" అనే నామకరణం చేశారు.

ఒకే పేరుతో రెండు చిత్రాలు ఎలా తయారవుతాయి? అందుకే కొందరు కొను గోలుదారులు తికమకపడి కృష్ణను, ఆయన సోదరులను అడిగారు. "శేఖర్ బాబు రిజిస్టర్ చేసిన టైటిల్ గడువుదాటి

**కృష్ణ, ఎన్టీఆర్ రాజకీయాలు చిత్రసీమనూ రొచ్చు చేస్తున్నాయి!**

ఎక్స్‌పైర్ అయిపోయింది గనుక మేము అదేటైటిల్‌ను రిజిస్టర్ చేసుకోవచ్చు. అలా రిజిస్టర్‌చేసి మేం షూటింగ్ కొనసాగిస్తున్నాం. అందేక, మా తప్పేమీలేదు" అన్నారు ఘట్టమనేనివారు.

"మేం రిజిస్టర్ చేసిన టైటిల్ గడువు దాటిపోయిన మాటమాత్రం నిజమే. అయినా, ఆ టైటిల్‌మీద హక్కున్నది మాకే. ఇలా మా టైటిల్‌ను మరొకరు వాడుకోబోతున్నారని ముందుగా తెలిసి వుంటే, ఆ గడువును పునరుద్ధరించుకొని వుండేవారం. అయినా, కథకు తగ్గట్టు మా చిత్రానికే 'సామ్రాట్' అనే టైటిల్ కరెక్ట్‌గా సరిపోతుంది" అని శేఖర్‌బాబు వాదం.

మొత్తంమీద 'సామ్రాట్' పేరుతోనే రెండు చిత్రాల నిర్మాణమూ సాగుతున్నాయి. చివరికి ఒక చిత్రం పేరు "సామ్రాట్ రమేష్" అని, మరోచిత్రం పేరు "సామ్రాట్ బాలకృష్ణ" అని మారిపోవచ్చని కొందరు జోక్‌గా వ్యక్తం చేస్తున్నారు.

బాలకృష్ణ నటించే "సామ్రాట్" డిసెంబర్‌కి గాని పూర్తవదు. రమేష్ నటించే "సామ్రాట్" అంతకన్నా ముందే పూర్తయి విడుదలవవచ్చు.

కొందరు మధ్యవర్తులు ఈ రెండు సంస్థల మధ్య రాజీ కుదర్చడానికి ప్రయత్నించారు గాని ఫలితం లేకపోయింది.

—కొరవ 13వ పేజీలో

# పాపంలా పెరుగుతున్న నిర్మాణ వ్యయాన్ని పరిహరించే యత్నం

మాతృఫిల్మ్ ధరలు, ఇతర వ్యయాలూ అధికంగా పెరిగిపోయాయి ఒకవంక. మరోవంక నటీనటులు తమ రేట్లను అత్యధికంగా పెంచేశారు. ఈ పరిస్థితులలో తెలుగు చిత్రాన్ని నిర్మించి విడుదల చేయడమెలా అని నిర్మాతలు కటకటాయిస్తున్న సమయంలో సహజకవి మల్లెమాల సుందరరామిరెడ్డి ఒక మంచితని చేసి ఎందరికో మార్గదర్శకులయ్యారు.

ఈయన సమర్పణలో ఈయన పుత్రుడు ఎం. శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి నిర్మించిన "తలంబ్రాలు" లఘు బడ్జెట్ చిత్రం అతి తక్కువ కాలంలో తయారైంది. ఇందులో పేరమోసిన తారలు లేరు. కాని, ప్రేక్షకులను ఆలోచింపచేసే రసవత్తరమైన కథ ఉంది. ఇది కథకాదు. వాస్తవం అనికూడా చెప్పొచ్చు. ఈ చిత్రంలోని నాయిక పేరు రాధిక. అనాటి సీత నుంచి ఈనాటి రాధిక వరకు అది దాని బలహీనత 'సెంటిమెంట్' దాన్ని

**పరిశ్రమకు ఎమ్మెస్ రెడ్డి మార్గదర్శకత్వం**

నాయుకోవడం కొందరు మగమహారాజులు టెలెంట్, తరతరాలుగా యుగయుగాలుగా మగవాళ్ళ చేతిలో ఆడది పిచ్చిదిగానే మిగిలిపోయింది. దేవతలు మోసంచేసిన అహల్యనుంచి మనుషులవల్ల నాశనం అయిపోయిన ఈనాటి రాధిక వరకు ఆ బ్రహ్మదేవుడు ఒకే తలరాత రాశాడు. కాని, ఆడది అమాయకతలో అబలగా ఆత్మీయత పంచిపెడుతుంది. గుండె మండిందో- దశదిశలు ఏకం చెయ్యగల దశావతారాలను మించిన ఏకాదశావతారం అవుతుంది అని తెలియజేసే "తలంబ్రాలు" చిత్రంలో కల్యాణ చక్రవర్తి రాజశేఖర్, జీవిత అద్భుతంగా నటించారు. ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ రూపొందించిన కథకు గణేశ్‌పాత్రో భావగర్భితమైన సంభాషణలు రచించారు. సత్యం సంగీత దర్శకత్వంలో మల్లెమాల, రాజశ్రీ రచించిన పాటలు అత్యుత్తమ స్థాయిలో మళ్ళీమళ్ళీ వినాలనిపించేం తలకర్ణపేయంగా ఉన్నాయి. కోడి రామకృష్ణ దర్శకత్వం ఈ చిత్రానికి మరో ఎస్సెట్.

"నా ధ్యేయంకూడా పాపంలా పెరిగిపోతున్న చిత్రనిర్మాణ వ్యయాన్ని తగ్గించడమే. ఇలాంటి చిత్రాలను ప్రోత్సహించడానికి నేను న్నాను." అంటూ "ఈనాడు" రామోజీరావు "తలంబ్రాలు" చిత్రాన్ని తన 'మయూరి' సంస్థద్వారా పంపిణీ చేయడానికి ముందుకొచ్చారు. అందేక "తలంబ్రాలు" చిత్రాన్ని కొనుగోలు దారులకు విక్రయిస్తే రాబడివచ్చే కన్నా 'మయూరి' పంపిణీద్వారా ఎన్నో రెట్లు ఆదాయం ఎక్కువ రావచ్చు ఎం. ఎస్. రెడ్డికి.

మొత్తంమీద లఘు బడ్జెట్ చిత్ర నిర్మాణంలో రామోజీరావు, ఎం. ఎస్. రెడ్డి ఎందరికో ఆదర్శ ప్రాయులయ్యారు. "తలంబ్రాలు" చిత్రం విడుదలానంతరం ఎందరో నిర్మాతలు లఘుబడ్జెట్ చిత్రాల

—కొరవ 13 వ పేజీలో



"అష్టలక్ష్మీ వైభవం"లో కె. ఆర్. విజయ

# అమెరికాలో తెలుగు చిత్రాలు

కథల్లో వెరైటీ లేకపోతూంది, ఊటీ కొడైకెనాల్ షూటింగ్‌ల దృశ్యాలతో ప్రజలకు మొహంమొత్తిపోయింది. అలజడుల కారణంగా కాశ్మీరులో పాటలు చిత్రీకరించడానికి వీలవడంలేదు. అందేక అమెరికాలోనైనా చిత్రీకరణ జరిపితే కాస్త క్రొత్తలొకేషన్సును మనప్రేక్షకులు చూసినట్లు వీలౌతుందనేమో ఇటీవల నాలుగైదు తెలుగు చిత్రాల షూటింగ్‌లు అమెరికాలో జరుగుతున్నాయి. జంధ్యాల దర్శకత్వంలో విజయశాంతి నటించే "పడమటిసంధ్యారాగం" చిత్రంషూటింగ్ అమెరికాలో పూర్తయింది. కృష్ణ కొడుకు రమేష్‌తో జంధ్యాల దర్శకత్వంలోనే "చిన్నికృష్ణుడు" షూటింగ్ అమెరికాలో జరుగుతూంది. ఇందులో కుష్బూ హీరోయిన్.

అన్నపూర్ణా పిక్చర్స్ దుక్కిపాటి మధుసూదనరావుకూడా అమెరికాలో ఒక

**మా మద్రాసు సినీప్రతినిధి**

చిత్రాన్ని నెల్లూరీయుడు సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో తీస్తున్నారు. ఇందులో రాధిక హీరోయిన్. టీంలో

—కొరవ 12 వ పేజీలో

# • స్మృత్యంజలి •

మా వంశ దీపం మా ప్రత్యక్షదైవం మా అభ్యున్నతికి ఆలవాలం నిరంతరం

మమ్ము తన హృదయంలో దాచుకున్న అనురాగమూర్తి

జననం :
7-3-1907



అస్తమయం :
25-9-1982

# శ్రీ కూకటి కోదండరామ రెడ్డిగారి

చతుర్థ వర్ధంతి 25-9-1986

భగవంతుని సన్నిధిలో ఆయన ఆత్మకు చిరశాంతి కల్గాలని ప్రార్థిస్తున్నాము.

కుటుంబ సభ్యులు

... 17/170 ... 524001